# ఉపోద్ఘాతము



ఐహికాముష్మిక సుఖంబులు వాంఛించు ప్రతిమానవునకు దైవప్రార్థనయే శరణ్యము. క్రతువులొనరించినను బెక్కువితరణములిచ్చినను బరమేశ్వరారాధనకు సాటిరావు. అట్టియీశ్వరు ననేకులనేకరీతుల ధ్యానించుచుందురు. సామాన్యముగా నట్టిధ్యానమునకుఁ జిరకాలమునుండి తెలుంగుదేశమున శతకపద్యంబు లుపయోగింపఁబడుచున్నవి. ఏతత్కారణముననే ప్రతికవియుఁ దనయిష్టదేవతను గుఱించి శతకము సెప్పియున్నాఁడు. అట్టిశతకములిప్పుడు వేనవేలుకలవు. ఈశతకకర్తలు శ్రీరామచంద్రోపాసకులు. అట్లగుట శ్రీరామచంద్రునిగూర్చి భక్తిపరవశ ధ్యానములతో నింపివైచిరి. (ండ్రీ) అను నక్షరము యతిస్థానంబున నుంచికొని యాద్యంతమువరకుఁ బోషించిరి. శైలి మృదుమధు రసప్రబోధితమై, భక్తిరసప్రధానమై, లోకవృత్తగర్భితమై, యస్ఖలితమై, పాఠకుల నానందకందళిత హృదయారవిందులఁ గావించును. ఏతత్కర్తలు ప్రాయమునఁ జిన్నలయ్యు సంస్కృతాంధ్రములఁ బ్రౌఢులు. వీరి స్వగ్రామము ఆడిపూడి. వీరియింటిపేరు ఆదిపూడివారు కాకున్నను, కారణాంతరములచే వీరు ద్వాదశవత్సరములనుండి స్వగ్రామమున నివసింపకయున్నను, దమచిన్ననాఁటి సహవాసక్రీడా

విశేషములు, తమజన్మభూమిపైఁ దమకుఁగల యభిమానము దేశికము గలిగిన "ఆదిపూడి సోదరకవుల" ను పేరుపెట్టికొనుట యెంతయుఁ బ్రశంసార్హము. ఆదిపూడిగ్రామమునకును అందలి హితబాంధవ జనమునకు నఖండకీర్తిని గలిగించిన యీసోదరుల జన్మగ్రామ ప్రేమ యతీతము. ఒకతల్లిగర్భమున గలిగినవారలనేక స్థితులనుండుటఁజూతుము. సోదరులిద్దరిట్టికవులగుట వారిజననీజనకుల పూర్వజన్మకృత పుణ్యఫలఃబని ననతిశయోక్తియేమి? ఏతద్గ్రంథ ముద్రణకువలయు ధనమొసంగి శ్రీరామచంద్రకరుణాపాంగదృష్టికిఁ బాత్రులైన మహారాంజరాజశ్రీ యం. యల్. నరసింహారావు పంతులుగారెంతయు ధన్యులు. వారికాయురారోగ్య భాగ్యములు గలుగుఁగాత.

ఇట్లు సుజనవిధేయుఁడు,

(సం) మునపల్లె నాగేశ్వరరావు, బి. ఏ.

జిల్లాకోర్టు వకీలు.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# శ్రీరామచంద్రప్రభు శతకము.

శ్రీ సీతాసతి యంకమందొనర వాసిన్ లక్ష్మణాఖ్యుండుదా
భాసిల్లన్ గొడుగెత్తిపట్టనవిడన్ బార్శ్వస్థులై కైకజుం
డా సౌమిత్రియు గాఢపట్టినుతిం జేయన్ బీఠమందున్న నీ
వే సర్వాత్మకమైన బ్రహ్మమవు తండ్రీ! రామచంద్రప్రభూ!

శా. ఆమోదంబున బ్రహ్మనాభికమలంబందున్ వసింపంగ శ్రీ
రామారత్నము పత్నిపీఠికపయిన్ రాజిల్ల బార్శ్వంబులన్
బ్రేమన్ భక్తులు గొల్వ బాలకడలిన్ శేషేంద్రుపైబండునీ
వే మూర్తిత్రయ మీవె దైవమవు దండ్రీ! రామ. 2

మ. పరమోత్కృష్టపదంబు, వైభవము, శుంభచ్ఛౌర్య గాంభీర్యముల్
వర వాగ్వైభవము, పాండితీగరిమ, విశ్వఖ్యాతమౌ కీర్తి, పై
నరిషడ్వర్గజయంబు, నిత్యమగు బ్రహ్మైశ్వర్యంబు, ప్రాపించెడిన్
జిరమౌ చిత్తము తోడ నిన్ గొలువ దండ్రీ! రామ. 3

మ. హరియంచున్ హరుడంచు భిన్నమతులై యన్యోన్యవైరంబు గొం
డలు చూపింతురు కాశి తారకముగా తన్ జేరి బోధించె శ్రీ
హరి రామేశ్వరమందు గొల్చె శివు నన్యోన్యప్రియం బెక్కుడౌ
టెఱుగం గాంచి, సదా నిన్ గొలుతు దండ్రీ! రామ. 4

మ. అనినోడించిచమూసమూహములు రాజ్యభ్రష్టులఁ జేయనిం
ద్రునినాశాపతులన్ దశాననుఁడు పేంద్రుఁ డన్నఁ బ్రార్థించియుం
టన, యాదిత్యులఁ బ్రోవఁ బంక్తిరథునికిన్ మూర్తులై నాల్గుపు
ట్టినవిష్ణుండవు, రాజమాత్రుఁడవె? తండ్రీ! రామ. 5

మ. క్షణసౌఖ్యంబునకాసఁ జేసి వ్రతభంగంబొందిపెక్కేండ్లు రా
ననసీమన్ బెనుబండయైనమునికాంతన్ హల్యఁగాఁ గ్న్యతన్
వనితన్ గా నొనరించి పాదహతివిశ్వస్తుత్యతన్ జెన్ను మీ
ఱినవిష్ణుండవు, రాజమాత్రుఁడవె? తండ్రీ! రామ. 6

మ. మునురాత్రించరుఁడొక్కఁడేగితొలివేల్పున్ నిద్రబోనిచ్చి వే
దనిధిన్ దొంగిలియబ్ధిడాఁగ నురుమత్స్యాకారుఁడక్కాఁడిదై
త్యుని, నాధ్యాత్మికబోధతోయుపనిషత్తుల్ బ్రహ్మకర్పించియుం
డినవిష్ణుండవు, రాజమాత్రుఁడవె? తండ్రీ! రామ. 7

మ. వనధిన్ద్రచ్చెడువేళ లోకములు క్షోభన్ జెందవారింపఁగన్
ఘనకూర్మాకృతిఁ బృష్ఠభాగమున వీఁకన్ మంధరంబెత్తి మో
హినివై దైత్యులమోసగించియమృతంబిందాదులన్ ద్రావఁబె
ట్టినవిష్ణుండవు, రాజమాత్రుఁడవె? తండ్రీ! రామ. 8

మ. మునులన్ గొట్టియమర్త్యులన్ గెలిచిదుర్బోధల్ ప్రతిష్ఠించి వే
దనిపెన్నుండు, ధరిత్రిఁజాపఁగ హిరణ్యాక్షుండు పుట్టంగఁ జె
ల్లనిదా గొప్పవరాహరూపమునఁ దెగ్గోల్జేసి భూబాధఁదీ
ర్చిన విష్ణుండవు, రాజమాత్రుండవె? తండ్రీ! రామ. 9

మ. నిను ధ్యానించుచు నీవెదిక్కనిసదా నీస్తోత్రముల్ సేయుపు
త్రునిదాడించినవెనన్ హిరణ్యకశిపుండున్ వెన్ను నీస్తంభమం

ఘనఁజూపిరిహ్రము నాన్నృసింహమయి దైత్యుం ద్రుంచి ప్రహ్లాదునే
లిన విష్ణుండవు, రాజమాత్రుఁడవె? తండ్రీ! రామ. 10

మ. ఘనబాహాపటుశక్తి నింద్రపదవిం గైకొన్న వైరోచనుం
గని యాచించి పదత్రయంబు వటువై, కాన్పించి విశ్వాకృతిం
దనుజుం ద్రొక్కి రసాతలంబునకు, నానాకేశు రక్షించి యుం
డినవిష్ణుండవు, రాజమాత్రుఁడవె? తండ్రీ! రామచంద్ర. 11

మ. తనరం గ్రూరగుణాఢ్యులై నృపులు పృథ్విం సార్థమై పట్టియుం
జనకుం జంపుట గంద్రగొడ్డలిమెయిం సర్వక్షమానాథ ఖం
డనముం జేసి శిరంబులం దినమున జెందం దండ్రికై మెట్టుక
ట్టినవిష్ణుండవు, రాజమాత్రుఁడవె? తండ్రీ! రామచంద్ర. 12

మ. వసరం దామ్రపతి శాఘగీర్పు మునుచుం బల్మాలు హాపద్వయం
బున శ్రీకృష్ణహలాయుధాభిధులతోఁ బొల్పారి కంసాది దు
ర్జనసంఘంబు వధించి పాండవుల కైశ్వర్యంబు సంధించియుం
డినవిష్ణుండవు, రాజమాత్రుఁడవె? తండ్రీ! రామచంద్ర. 13

మ. ఘనమాద్యంతము లేనిదై ప్రబలమోక్షప్రాప్తికిం మూలమై
చను నీయార్యమతంబు భంగపడుచుం జల్లింపదుష్టాళి బు
ద్ధునిరూపమ్మున నుద్ధరించి వినుతిస్తోమంబులం బొందియుం
డినవిష్ణుండవు, రాజమాత్రుఁడవె? తండ్రీ! రామ. 14

మ. అనిలోద్ధూత తృణంబువోలె నచలంబై నట్టి ధర్మంబు దు
ర్జనబోధాత్మక సంఘసంస్కరణ దౌర్భాగ్యమ్ముచేఁ గాఁగని
ష్ఠనురక్షింపఁగ ధాత్రిఁ గల్కి యగుచుం జన్మింతు నేనంచు నా
డినవిష్ణుండవు రాజమాత్రుఁడవె? తండ్రీ! రామచంద్ర. 15

శా. దృశ్యంబైన జగంబదేకతసవర్తించున్? సృజింపంబడున్
వశ్యంబై సకలంబుదేనికి? నభిప్రాయాంతరం బేల? యా
పశ్యంబెయ్యది వార్యసృష్టి లయసంప్రాప్తంబుచేకూర? సా
దృశ్యం బేర్పడనాకుఁ జెప్పఁగదె తండ్రీ! రామచంద్ర. 16

శా. ఆజన్మంబొకఁడొందు శ్రీని మఱొకఁడందున్ దరిద్రత్వమున్
దేజంబొందు శరీరమందు నొకఁడున్ నిత్యంబు నంగఘ్నతన్
దాజాలన్ శ్రమమొందు వేఱొకఁడు విస్తారంబుగా భేదమే
యేజాడన్ గననుండెనేకతము? తండ్రీ! రామచంద్ర. 17

మ. జనియించెన్ జనుఁడేమికారణమునన్ సర్వంసహాచక్రమం
దునవిధ్యుక్తములేవి? నిర్వహణమందున్ దప్పగానేల? త
ప్పనిభావించియుఁ జేయనేటికి? మహాద్యత్ జ్ఞానమెట్లబ్బు? కో
రినవాఁడన్ వచియింపఁగాదగును తండ్రీ! రామచంద్ర. 18

మ. కన,నేగానియు ధర్మమిచ్చుటకునై కాంక్షింపకున్నట్టి లు
బ్ధుని,లక్షాధిపతింబొనర్తు వసిశంబున్ దానమున్ జేయువా
నిని,నిష్పచ్ఛరమందుమంతువదినీనిస్తంద్రమాహాత్మ్యమా
నె? నిలింపాభినుతా! వచింపుమయ తండ్రీ! రామచంద్ర. 19

శా. భేదంబుల్ బహురీతులన్ జెలఁగు భావింపం జనంబందులన్
వేదంబుల్ నెఱనమ్మువారలు ఖురాన్ బ్రేమించువార్ బైబులున్
వాదింపంగలవారు భాష, విధులే వ్యత్యాసమైయుండఁగా
దేదూషింతురొకళ్ళొకళ్లరయఁ దండ్రీ! రామచంద్ర. 20

శా. ఎద్దానిన్ దెలియంగనేర్చునెడ నెంతేనిన్ సుఖంబబ్బునో?
కష్టో? లేదో? యటంచు శంకచనునో? కాంచన్ జగత్సృష్టికా

నెద్దో మూలమెఱుంగ నౌనా? సకలంబెద్దానవర్తించునో?
యుద్దానన్ దగునంచుఁ జెప్పఁగదె? తండ్రీ! రామచంద్ర. 21

మ. అతిసూక్ష్మంబయియుండ చందముల నేత్రానందముం గొల్పుచీ
వతతిన్ సృష్టియొనర్పనేల? ప్రతిజీవందున్ సుషుప్త్యాశనం
బెతగన్ బొందు, గతంబె వచ్చుమఱలన్ హీనోన్నతుల్ చక్రవ
ర్తితముల్ చిత్రముగాదె నీమహిమ తండ్రీ! రామచంద్ర. 22

మ. కకుబంతంబుల హారకాంతులు చెలంగన్, బర్హిసంఘంబుపై
ప్రకటింపన్ జయలక్ష్మి నవ్వులు, ప్రభన్ భాసిల్లఁగాఁగాంచియున్
సిరిపేర్చన్ దిలకించుబుజాలి శశికై చేఁజాచు నీశైశవం
బెక్కృపాంభోనిధి నిత్యమేఁ దలఁతు తండ్రీ! రామచంద్ర. 23

శా. పాత్రంబుల్ పరమందుఁ బూసియను జన్మల్ వోడ నానేగియున్
జిత్రంబుల్ దళుకొత్తనేర్చు కళలన్ శీఘ్రంబుగా నొజ్జపై
బత్రిన్, దల్లికిఁ దండ్రికిన్ ముదము నీబాల్యంబొసంగెన్ లస
ద్వృత్తిన్ గొల్చెదఁ గాన రాఁగదవె తండ్రీ! రామ. 24

మ క్షితినాథుల్ పొనరింపకుండిన, జయశ్రీనిత్యఁ జాపంబు మం
డిత దోర్దండ బలాతిరేకమున ఖండింపన్ క్షమాజాతశో
భితమై హారమలంకరింపఁగడు సంప్రీతిన్ జనంబుల్ ప్రమో
దితులై నిన్నుతియింపరే చెప్పుమ? తండ్రీ! రామచంద్ర. 25

మ. మతిలేకించుకఁ గాకుఁడన్ ఖలుఁడు దుర్మార్గంబుగావింప న
మ్మతిలాలించితి బాణమెక్కుడియుఁ జంపన్ లేకయూర్పైని న
చ్యుతమా కీరితి "రామబాణము"నునార్భొక్తిన్ ధరన్ బోదునో
ల్పితివేమంచు నుతింపఁజాలుదును దండ్రీ! రామచంద్ర. 26

మ. విలసిల్లన్ ధరఁ బ్రోవమానవులు నిర్వేధింతురంచెంచి స
త్కాలశాంభోనిధిలో మహోగ్రవిషయుక్తంబైన భోగీంద్రుపై
నెలమిన్ బండెదవార? మానవుఁగదా కృష్ణావతారంబునన్
పెంగన్ జేసినజిత్తులన్నియును దండ్రీ! రామచంద్ర. 27

మ. శని దుర్భాగ్యగుణుండు, దేవక వినీచస్థానమందుండె, దు
ష్టనికృష్టుల్ మఱి రాహుకేతువులు, కష్టంబుల్ నిజంబౌచు, ప్రే
ళ్లను లెక్కింతురు మూఢచిత్తులదియేలా? గీశులన్ బ్రోవఁబూ
నిననీవుండఁగ నంతయుంగలదె? తండ్రీ! రామచంద్ర. 28

మ. శనియొక్కంటఁ గుజుండు రెంట, గురుఁడాజన్మంబు, నాల్గింట దు
ర్జనుఁడై చంద్రుఁడు వేఱొకంటఁ బుధుఁడున్ రక్తాంగుఁడుండౌటన్
మిను రెంపేసిఁట దైత్యులంతనిలువన్ గాంచద్భయంబొందఁగా
శనినన్ జూడనొయ్యంచు భీతిచెందఁ దండ్రీ! రామచంద్ర. 29

శా. హా! స్వామిన్నల్ రతనాలు దెచ్చితివె నాకై యంచు నిల్లాలు, మా
కై స్వామిపైనవి గుడ్డలిచ్చితివె యంచాత్మోద్భవుల్ తిండికై
కాసైనన్ గలదంచుఁ దల్లియుఁగటా కాదింపఁగా నేలకో
యీసంసారములన్ సృజింతివి? తండ్రీ! రామచంద్ర. 30

మ. ప్రబలన్ గుత్సుకకడ్డమైక షమము శాస్త్రజ్ఞుండు వైద్యుండు నా
డిఁబరీక్షించియు లాభమేమనఁగఁ జింతిల్లంగ సద్బంధువుల్
"లభోలబ్బో" యనినెత్తిమోఁదికొని భార్యాపుత్రులేడ్వంగనిన్
విబుధారాధ్య స్మరింపఁగాఁదరమె? తండ్రీ! రాడచంద్ర. 31

శా. జ్ఞానంబేమియులేనికాలమున నేఁగావించితిన్ దుష్కృతౌ
న్నానిన్ గుద్రిడిచేయు తప్పులకునేఁదున్ లెక్కలేకుండెన
వ్వానిన్ సైరణసేసి యింకనటుసల్పన్ బుద్ధిపోసిక యెం
తేనిన్ దయఁజూపవేడెదను దండ్రీ! రామచంద్రప్రభూ. 32

మ. సుతుఁడంధుండో;సురూపియో; వటువో; గుజ్జో;
కుంటియో; పీతధీ;
యుతుఁడో;దుర్బలుఁడో;కుమాయికగుఁణుండో;లేకదారిద్ర్యసం
భృతుఁడో;యూనిడఁదల్లికేవగటుదోపించున్ గదా! యూరి!యూ
నె తలంపంగఁదరంబు నీనుహిను? తండ్రీ! రామచంద్ర. 33

మ. వ్రతలోలుండగు నంబరీషుఁగని దుర్వాసుండుకోపించి దు
ర్మతియైశక్తనిబంప నాతఁడు "మహాత్మా" యంచునిన్ వేడఁబం
చితిచక్రింబడిమానిగర్వమునణంచెన్ గాదె? యిట్లాత్రి నీ
హితులౌవారికిఁ గష్టముల్ గలవె? తండ్రీ! రామచంద్ర. 34

శా. మోక్షాసక్తజనాళి రక్షణము నాపూర్ణక్షమాక్షితం
బక్షీణప్రతిభాసమక్షము విపక్షా క్షోహిణీభేదమున్
రక్షోదక్షకులక్షయంబు సుజనప్రాణావనోత్సాహమున్
శిక్షోపాయము రామనామమిలఁ దండ్రీ! రామచంద్ర. 35

శా. మాయామేయ జగంబునన్ బడి జనుల్ మానంబు
పోనాడియున్
రోయన్ దజ్జులు నీచదైవములకు మ్రొక్కంగనేలా? యేదో
చాయన్ మ్రొక్కినసీకుమ్రొక్కవలెమోక్షంబిచ్చినన్ వేగనీ
వేయూయన్ వలె నెవ్వరీఁగలరు? తండ్రీ! రామచంద్ర. 36

మ. నరసన్ జేరి మహోమహోగ్రతర భాస్వద్దేహకాలుండు దు
ర్భరపాశంబును దండముం గొని ననున్ బాధించు నాకాలమం
దురహిన్ నిన్నుతియింపఁజాలుదునొ లేనో యిప్పుడే యొక్కసా
రి "రమేశా! రఘురామ!" యంచనెదఁ దండ్రీ! రామచంద్ర. 37

మ. హితుఁడెవ్వఁడు? కుమారియెవ్వతె? సుతుండెవ్వాఁడు? తోఁబుట్టువె
వ్వతె? భృత్యుండెవఁడన్నదమ్ములును నెవ్వారల్ వరారోహయె
వ్వతె? ప్రాణంబులు వోవునప్పుడు, తరింపన్ జేయ లోకాళినం
డితిపివొక్కఁడవే తలంచెదను దండ్రీ! రామచంద్రప్రభూ. 38

శా. మాయావృత్తజగంబె మోక్షమని సంభావించి దుర్భాగ్యులై
జాయాపుత్రహితాళి పోషణకళాసామర్థ్య మెవ్వారఁగన్
డాయన్ బోకయమాలయుంబు, భువినిన్ బ్రార్థింప స్వర్గంబురా
దే? యెవ్వారలకైన నిక్కముగఁ దండ్రీ! రామచంద్ర. 39

మ. ఒకఁడాయెన్ ధరణీతలేశ్వరుఁడు, వేఱొక్కండు లోకేశుఁడౌ
టకుఁ గాంచెన్ వర, మొక్కఁడందె దివి, గండండయ్యె నింకొక్కఁడీ
వకృపన్ జూడనటంచు వాక్యములవేలా? నాకునన్ బ్రోవఁగా
దెకనన్ నీమహిమంబు వెల్వడుట, తండ్రీ! రామచంద్ర. 40

శా. ఆరాధింపఁగనిన్ గుటుంబకరనోగ్నాగ్ని ప్రభల్ మైకొనన్
గారుణ్యామృతసారగుంభిత కటాక్షశ్రీలఁ బోకార్చి స్వ
ర్గారోహాంబుజశాళికిచ్చు నినుభక్త్యావేశతన్ గొల్వనే
శ్రీరాజీవభవుండనోదనోకా? తండ్రి! రామచంద్ర. 41

మ. నిజమేఁబల్కెద బాహులెత్తిడితిజానీకాతి గర్వాపహా
ర!జగద్రక్షక!లోకపూజిత!వినీలశ్యామ! విశ్వాత్మకా !
నిజభక్తావన! నీవెదైవముసుమీ నిఖిలరవ్వారు వా
రిజగర్భాండము సృష్టింపగను దండ్రీ! రామచంద్ర. 42

శా. స్వామీ! నిన్ స్మరణంబుసేయుమదినెంచన్ మన్మనసంచరత్
కామక్రోధవిమోహలోభ మదమాత్సర్యంబులెంతేనియున్
వేమాఱడ్డమువచ్చి విఘ్నములఁగావించున్ గదా! నన్నెటుల్
నీమర్మంబెఱిఁగించిపోద్రెచెదవా? తండ్రీ! రామ. 43

శా. ఏమంచున్ వచియింతుఁ,గామరహితుండేయారయుంగాకనీ
దౌమహాత్మ్యము మూఢుఁడారయఁగలండా?క్షీరనీరంబులన్
బ్రామాణ్యంబున వేఱుచేయఁ గరాళంబెంచఁ గాఁజాలుగా
నీమార్గాలముచాలునేయెపుడు? తండ్రీ! రామ. 44

శా. కాష్ఠంగలవాఁడు రాముఁడొకఁడేకాంచన్ నిజంబీవదే
లా?పల్మాఱుజపింపవన్నఁబెడమార్గంబూనియెల్లప్పుడున్
బాపాత్ముండువినందు సూకరముదాఁ బంకంబునే మెచ్చుఁగా
నీ పన్నీరునుమెచ్చునే యెపుడు? తండ్రీ! రామ. 45

మ. పరమోత్కృష్టత వేదశాస్త్రచయమున్ వల్లించినన్ నిన్నుహృత్
సరసీజంబున నిల్పఁడేనినదివ్యర్థంబౌనుగాదే మహో
త్కరశాకంబులు భీమపాకమునన్ గానీయుముప్పేయు రే
నిరవంతైనరుచించునేయెపుడు? తండ్రీ! రామ 46

మ. జననంబాదిగ దుష్టకార్యముల నార్జన్ జేయుచున్నట్టి పా
పునిసత్కార్యములన్ బొనర్చి రఘురామున్ లోన ధ్యానింపుమ
న్నను వేమాఱు డిపమున్ జలంబిడినయంతన్ బాగుగాఁగాగునా
నెను, భగ్నగ్నిమంట దేయెప్పుడు? తండ్రి! రామ. 47

మ. ఘనుఁడేమైన మహానుభావుఁడయినన్ గష్టాత్ముఁడై పోవునీ
వనయంబున్ దయఁ జూడవేని మనుఁ రాజ్యంబెల్లఁ గోల్పోయి యో
జను భార్యన్ సుతు విక్రయించి యుహరిశ్చంద్రుండు గాఁగ నల్లకా
టిని సంచారము సేసియుండఁడో కో? తండ్రి! రామ. 48

మ. శతజన్మంబులనుండి నేజలుపు దోషప్రక్రియల్ పర్వతా
కృతి నానాఁటికి వృద్ధిఁ బొందుటలిదే యూహించి మిన్నాఁతి న
ట్లుతలన్ గొంకుదుఁ, దన్న గంబు దెకనట్టున్ న్వత్పద ధ్యానచో
దితశక్త్యంద్రమునన్, గృపంగనుము తండ్రి! రామ. 4)

శా. పాపాగ్నిచ్ఛట లెల్ల మిక్కొనియెఁ దాపం బద్దమెండాయె బ్రా
ణాపాయమ్ము పొసంగు చిహ్నముల వేమావిర్భవించెన్ సుపా
ఖ్యోపాయంబిఁక వేఱు లేమ గొలుతున్ యుష్మత్కృపాసారము
న్దీపింపంగ శ్రమంబు బాపఁగదె తండ్రి! రామ. 50

మ. తగ వ్యత్యస్తముగా "మరా" యనుచు సప్తర్షుల్ ప్రబోధింపసో
కఁగ నాల్కన్ సకలంబు మైమఱచియున్ గన్మూసి ధ్యానించుచోన్
మగులన్ బుట్టలు పెట్టి చెట్లు మొలవన్ నీనామమున్ బాయఁడ
య్యోఁగదా! మేటికిరాతుఁడచ్చెరువు తండ్రి! రామ. 51

మ. ధనమే మూలము ధారుణీస్థలికి విత్తంబేమి లేకున్న జీ
వనమున్ జేయుట దుర్భరంబనుచు విస్పారవ్యథాసీడి తా

త్మను గుందుర్ నిరుపేద చోరభయజాతక్లేశతన్ బీదవో
లెనటించున్ ధనవంతుఁ డచ్చెరువు తండ్రీ! రామ. 52

మ. ఒదవున్ గష్టములింటనుండనని, లోనూహించి తప్పించుకో
గదురన్ మార్గము శైలకంధరములన్ గాంతారమధ్యంబులన్
బదిలంబా? కదియంగ వెంటఁబడవా? త్వన్నామ దివ్యౌషధం
బెదిగన్ ద్రావిక దప్పగా కెప్పుడు తండ్రీ! రామ. 53

మ. సకలవ్యాధులడంచు మందులని, యూసన్ వానిసేవింతుర
ద్ధికనన్ ద్వన్మహిమాఢ్యచిత్కలిత సద్దివ్య జగద్బంధుభా
త్మకమౌఁగాఁ బెడమార్గమేల నరిగాఁ ద్వన్నామదివ్యౌషధం
బె కడంకన్ దిగఁద్రావఁ దప్పవొకో? తండ్రీ! రామ. 54

మ. తనుసంబంధము శాశ్వతంబనుచు వెంటన్ వచ్చునంతంబు జా
డనెఱుంగన్ దలపోయక జ్ఞతనహో! డంబంబునన్ దాఁచరిం
చునరుం డెప్డు, కుటుంబపంకమిది లోఁచున్ గాని స్థైర్యంబురా
దెనిమేషంబయినన్; దయంగనుము తండ్రీ! రామ. 55

మ. అనయంబున్ భవదీయ పాదకమలధ్యానాకులస్వాంతతన్
గని "కృష్ణా" యని విన్నుతించు నవిహంగంబౌ గరుత్మంతుఁడా
తనిభాగ్యం బదిమెంతమోకద! జనుల్ తారెంతఁగాఁ బెద్దలై
యెనయన్ జాలరు నిన్ స్మరింపఁగను తండ్రీ! రామ. 56

మ. నిరతంబున్ ముకుళించిహస్తములనిర్నిద్రాచ్ఛభక్తిన్ "రఘూ
వర! రామా!" యనిత్వత్పదాంబుజసమీపంబందులన్ నిల్చినిన్
స్మరియించున్ హనుమంతుఁడాతని దెప్పుణ్యంబన్న, నేఁగ్రోల్లను
స్థిరతా? నాస్తిమిఁకెట్లుపోద్రెచెదవో! తండ్రీ! రామ. 57

మ. కలలోనే, న్నినుధ్యానముఁ జలుపఁగాఁ గాంక్షింప
కున్నట్టిమూ
ఢులెయైశ్వర్యములందుచుందురిగద, టాటోపమ్ములేకెప్పుడుఁ
దలఁపన్ మ్రొక్కఁగనున్న వారలుమహాదారిద్ర్యభారంబులో
నిలజీవింతురిదేటిచోద్యమయ? తండ్రీ! రామ. 58

మ. తానీక్షించుచునుండ నెందఱోతనుత్యాగంబునుంబొందనే
కేనిన్ జావకతప్పదంచెఱిఁగి యద్దేతేర నున్నంతటన్
మేనన్ గంపము భీతిదుఃఖము తలన్ మిన్వడ్డయుల్లానుగా
దే?నన్నా స్థితిబొందనీయకుమి, తండ్రీ! రామ. 59

శా. కష్టంబుల్ ఘటియిల్లినంతటనె సిగ్గావాడవర్ధించి వి
స్పష్టంబయ్యవిలీలినంతటనె నీజాడన్ గనంబోరు, ఛీ!
దుష్టుల్ లోకులు పాపపంకజలధిన్ దోఁగాడుచున్నారిసీ!
యిష్టావాప్తికి మూలమీవనక తండ్రీ! రామ. 60

మ. నరకంబెక్కడనోయటంచు మదిలోనన్ దల్పఁగానేల? యీ
ధరనేయున్నది వ్యాధిరూపకమునన్ దారిద్ర్యభావంబునన్
నరులన్ బీల్చుచుఁబిప్పిచేయుచునినున్ ధ్యానించుటే స్వర్గమా
నెఱచిత్తంబున నిన్నుఁగొల్చెదను దండ్రీ! రామ. 61

మ. గతజన్మంబుల నెన్ని పాపముల నేఁగావించియున్నాఁడనో
నత్రాహీన దరిద్రభూత కృతకష్టప్రక్రియన్ దోఁగి నీ
హితవున్ జేయఁగనోచనైతిఁ దరమే దేనిన్ భరింపఁగఁగా
ని తల్లడ్లబెచెనకన్ దరిద్రితను దండ్రీ! రామ? 62

మ. కులమా! లెక్కకురాదు, మానము! చెదుర్ శోభా!
మనోవానమై
యలరుర్, గిరిలియా!హీనుళక్కి, యపనిందా! నెత్తి పైకెక్కుచు
ట్టలయందుర్ మటిమిత్రులందునగు బాట్లా! లెక్కకుర్ మిరిచునీ
యిలపై కష్టదరిద్రజాతునకుఁ దండ్రీ! రామ. 63

మ. ధనకాంతామణి పాదపద్మములఁ జేతర్ బట్టిరియొత్తంగ భ
క్తినిమందస్మిత కాంతులుర్ దిశలవ ద్దీపింప నా సేతు శీ
తనగాంతంబు ఘనీభవించెఁ దొలివిద్యాకాంతయానాఁడో వ
న్నెనుగోల్పోయి ధనాంగనర్ గొలుచుఁ దండ్రీ! రామ. 64

మ. ధనమూలంబుజగంబటంచుమునుఁ బెద్దల్ చెప్పియున్నారలా
ధనకాంక్షర్ నరుఁడేయకార్యమున కేఁ దాఁ జొచ్చుఁ జేకూరదే
ధనమెంతేని మదించి గర్వమున మాన్యశ్రేణిఁ గారించు నె
త్తినఁగండ్లుండుటఁ బైనఁజూవులగుఁ దండ్రీ? రామ. 65

మ. అరయర్ జేనెఁడుపొట్టకై వెతలలోనాప్రొద్దులుర్ బోవునం
దు,రుజల్ దుఃఖములుర్ సుఖంబులగునెందుర్ జూడఁజిత్తంబును
స్థిరతర్ జెందదు నాపురాకృతముచేఁ జింతించెదర్ నిన్ను నా
నెటసుల్ దోంచి కృపర్ గనర్ వలయుఁ దండ్రీ! రామ. 66

మ. అనఘాత్మా! యురసోలనూకలకునై యాజన్మమీ దేహ మొ
క్కనికిర్ విక్రియముర్ భానర్పఁ తిరుగంగా వాడవాడర్ గొనం
గనుబూనండొకఁడైన,విద్యయును లెక్కర్ రాదు, దుర్విద్యనే
ర్చినవారల్ యజమానులౌకతనఁ దండ్రీ! రామ. 67

మ. అకటా! చిత్తము స్థైర్యముం గనదు, దుర్వ్యాధుల్ బలంబౌను దో
పకక్షర్జంబుమనోవ్యథల్ మిగుల సంప్రాపించెడిన్ మృత్యువో
సిక చేఁబట్టియులాగుచున్నయది నిన్ జింతింపగాఁ గాలమి
ద్దెకదా! "శ్రీరఘురామ! రామ!"యని తండ్రీ! 68

మ. గడియన్ వచ్చెదు సంగతుల్ తెలియఁగాఁ గాదెప్పుడెవ్వానికిన్
వడివిజ్ఞానము లేదు భూతమునకున్ బ్రాణంబులన్ దాల్పఁగాఁ
బుడమిన్ గారణమేమొ, నాటకములౌ పోల్పంగ సంసారముల్
విడువం జాలము మోక్షమీయఁగదె తండ్రీ! రామ. 69

శా. అజ్ఞానాంధతమాబ్ధినిన్ మునిగి హృద్యంబై మహత్వంబు సౌ
విజ్ఞానంబతిదూరమై చనగ నుర్విన్ గామలోభాదులన్
బ్రజ్ఞాధుర్యతఁ గోలుపోతిఁ కట! నానాకష్టముల్ కల్గెడిన్
జిజ్ఞాసన్ నిను వేడుచుంటినయ్య, తండ్రీ! రామ. 70

శా. ఆయుర్దాయము నూటయిర్వదని వ్రాయంజాలె నార్యాళి కా
నీ యిష్టో విపరీతముం గనియెనే యెవ్వేళకేమో మహా
పాయంబుం గమనించి సంతతము నిన్ బ్రార్థింతు దీపంబునం
దే యేమేన్నవరించుకోవలదె? తండ్రీ! రామ. 71

మ. పొసఁగన్ గష్టములెన్నియేనియు సుఖంబుల్ లేకచూపట్టనీ
రసనైన్ కాపుర మెల్ల వేళలఁ దుదన్ రాదండహస్తుండు దా
నుసురుల్ చేకొన మోసగించి యొటులో నుండంగ యత్నించుచుం బో
మొసఁగన్ బానము తీపియొట్టిదయొ తండ్రీ! రామ. 72

మ. అరిషడ్వర్గమునాఁగఁ గుంజరములా యారున్ మనీషాసరో
వరముం జొచ్చి కలంతపెట్టెడిని నెబ్బంగిన్ గజానీకమే
డ్తైఅనేలంగలవాఁడనో తెలియకుండెన్ ద్వత్పదాంభోజ భ
క్తిరతిన్ బొందక సద్దయాంకుశము, తండ్రీ! రామ. 73

శా. ఆశాపాశమనంతదీర్ఘమయి వే యాకాశముం దాఁకి పై
నాశాంతంబులనంటిచుట్టి యిఁక బ్రహ్మాండంబునం దెందుఁబో
లేశంబౌ నవకాశముండమి మదిన్ దృష్టిన్ గనంజాలకే
"యీశా!"యంచు దరిత్రి వ్రాలుగద! తండ్రీ! రామ. 74

శా. కాంతాపుత్రులుతల్లిదండ్రులు మొదల్ గాఁగల్గుచుట్టాలపై
నెంతో మక్కువయుండెఁ దీరదువయస్సెంతైనఁ జెల్లంగనా
స్వాంతంబద్ది కలంతఁ జెందెడిని నిన్ ధ్యానింపగా లేదు "మ
న్నింతున్ నిన్న"ని సత్కృపన్ బలుకు తండ్రీ! రామ. 75

శా. శ్రీరాముండొక రాజమాత్రుఁడని భాషింతుర్ జనుల్
కొందఱా
తీరున్ నేఁబరికించితిన్ దుదకుబుద్ధిన్ దోచెనేశక్తియా
ధారంబై జగమంతప్రానినదౌ యద్దానిన్ వచింతున్ మదిన్
"శ్రీరామా"యని యాత్మకిఁపగుట, తండ్రీ! రామ. 76

శా. దేవుండాద్యుఁడనామకుండభవుఁడున్ దివ్యుండజుండున్ గుణా
భావుండౌఁగద, పేరుపెట్టిపిలువన్ భాష్యంబనా; నెమ్మదిన్
భావింతున్, బయిఁజెప్పినట్టుల, జగద్వ్యాప్తంబునౌ చిత్తునే
నేవేళన్ స్మరియింతు "రామ"యని తండ్రీ! రామ. 77

శా. "శ్రీరామా!" యనిభక్తిపూరిత మనశ్శ్రీమీఱఁ బ్రార్థించి న
ద్ధీరుల్ పల్వురు మోక్షముఁగనిరి పృథ్విన్ దానినీక్షించి నీ
పైరాగంబున నీపదాబ్జయుగసేవన్ జేయ నిచ్ఛించితిన్
"శ్రీరామా! రఘురామ! రామ!" యని తండ్రీ! రామ 78

శా. సౌఖ్యాసక్తత స్వర్గలోకమును విస్తారంబుగాఁగోరి బ్ర
హ్మాఖ్యన్ వర్తిలు జ్ఞానమూర్తివని నీయాధ్యాత్మికప్రాభవ
వ్యాఖ్యానంబులఁ జెప్పుచుండ్రు విబుధుల్ వాగ్మాధురిన్ గ్రోలుచున్
నీఖ్యాతిన్ స్తుతియింపనావశమె, తండ్రీ! రామ. 79

మ. ఒకశీతాంశుఁడు వారికుంభములలో నొక్కొక్కఁడై తోఁచు పో
లికలో నీశుఁడనేకనామముల నీ కేర్పడెన లోకాళికే
లికయౌ భిన్నమతంబులన్ దెలఁగు నారీతిన్ విచారించి ని
న్నికఁ బ్రార్థించెద సద్దయం గనుము తండ్రీ! రామ. 80

మ. తొలిజన్మంబునఁ జేసినట్టి యఘపుంజంబున్ గాన సారస్యము
న్నలవంబేనియు లేక సత్ప్రభల చింతన్ జెందఁగాఁ జేసెనిన్
దలఁతున్ నెమ్మది, గానసంయుత కవిత్వప్రాభవంబిచ్చి యీ
యిలపైనెవ్వగఁ బాపి ప్రోవుము, తండ్రీ! రామ. 81

శా. పాపంబిర్వదికించుమించయినఁ బూవట్టున్ గుటుంబంబోగిన్
హేయంబై నరకప్రసంగమునయి యెంతే నిన్నుఁ బ్రార్థింతునా

మాయన్ దోఁచకలంతఁబాపియఘముల్ మన్నింపుమా! దక్కనీ
వే యిష్టంబులిడన్ ముముక్షులకుఁ దండ్రీ! రామ. 82

మ. విపులంబైన జగంబుసర్వమును నడ్పింపంబడున్ దేనికె
ల్లపుడున్ లోనయి మాధ్యమానసులకున్ లభ్యంబుగాశక్తిశ
క్తివరంబాద్యము జ్ఞానమూలముధరిత్రిన్ గల్గుమార్గంబు ల
న్నిపరీక్షింపఁ బరాత్మనీవగుదు దండ్రీ! రామ. 83

మ. భ్రమమైపుట్టినదాది దుర్జనుల సావాసంబునన్ దోఁచు దు
ష్టమనుష్యున్ భవదార్చనన్ జరుగు యజ్ఞస్థానమందుంచ భ
క్తిమెయిన్ గొల్వఁగఁబోఁడు కుక్కకుధరిత్రీ రాజ్యమిప్పించుచో
నెముకల్ మెక్కుట మానఁగాఁగలదె తండ్రీ! రామ. 84

మ. మదమాత్సర్యములాది శత్రువులుకంపంబొందు
దాపింప, లో
నదరున్ దగ్గఱఁగ్రూరజంతువులు, డాయన్ జెంతభీతిల్లు దు
ర్మదపాపంబులు, జంకుచుండుదరి జేరన్ దుష్టగ్రహంబుల్,సదా
యెదలో నెంచిన 'రామ,రామ' యని తండ్రీ! రామ. 85

మ. ధనమంతన్ వ్యయపెట్టి 'రామ!రఘునాథా!మాధవా!'
యంచు జిం
తనమున్ జేసిన, బంధనాలయము లోనన్ బెట్టి నీవెంతోఁచి
క్కనుగష్టంబులఁబెట్టి వానికినినాగోపన్న కాఁబట్టి తా
ళెను నేఁడాళఁగఁజాలఁ బ్రోవవలెఁ దండ్రీ! రామ. 86

మ. తెరపైగూల్చియుఁదోలుబొమ్మలనుబ్రీతిన్ గాధలన్ జెప్పిక్ర
చ్చఁబనాడించెడువాని భాతిని ధరాచక్రంబునన్ జీవులో

టిరహిన్ గల్పనచేసి యాటలనునాడింపంగ దక్షుండ వీ
వెరమానాథ! భవార్తిమాన్పవలెఁ దండ్రీ! రామ. 87

శా. కాలంబా! కలిరాజపాలితము, లోకంబందుతామసంబుదు
శ్శీలంబార్యజనాపవాదము బుధశ్రేణిన్ ఖలత్వంబహో!
చాలన్ గల్గుధనాధికారములు నీచస్థంబులౌచుంటనే
లీలన్ నేర్తు సుఖంబుగా మనఁగఁ దండ్రీ! రామ. 88

శా. దేహారోగ్యము లేదు నాకెపుడు, భక్తిన్ నిన్ను బూజించుచున్
గేహంబందున నుందునా? యనిన భక్తిన్ గష్టముల్ గల్గు నీ
దేహార్థంబయి పొట్టచేతఁ గొనియే దేశాలపాలౌదు స్వా
మీ! హా! దుర్భరమాయెఁ గాపురము తండ్రీ! రామ. 89

మ. క్షణమాత్రంబు నినున్ స్మరింపక యె మోక్షం బెట్లు పొందంగలం
డీ నరుండెల్లప్పుడింద్రియంబులకు సంతోషంబు చేకూర్చుచు
న్నను పాపంబగునట్టి వానికిని సంతాపంబుఁ బాపంగ భ
క్తిని నీనామమె తారకంబగును తండ్రీ! రామ. 90

శా. సంసారాంబుధినిన్ దరింపగ నినున్ నీశా! తారకంబీవ, వి
ద్వాంసుల్ ప్రత్యహమున్ భజింతురిల, వార్తత్రాణపారీణ! నిన్
శంసింతున్ సతతంబు భక్తిమెయి విశ్వాసంబు నుంజూప వే
హింసింపన్ యముఁడేగుఁదెంచు నెడఁ దండ్రీ! రామ. 91

మ. అవనిన్ గల్గు సమస్తజీవ తతి కాయా జాతకంబుల్ లిఖిం
తే వయా చే! నిగమాంత వేదియయినన్ దుర్వార కాల ప్రభా
వ విశేషక్రియ పట్టికంగడవ నావంతేని సమర్థుండు కాఁ
డెవఁడేన్ జరిత్రము నీకథా సరళి తండ్రీ! రామ. 92

మ. అవనిన్ దంతివిహీనవార్తలు,లసద్యంత్రంపుగానంబు, పై
న విమానంబు,మహాబ్ధిస్టీమరు,జలాంతర్గామి,రైల్ బండి,యిం
పవుసీసీమయుఁ దటిద్బలంబుజనుఁడా హా!సృష్టిఁగావించెఁగా
నవిధాతృక్రియ నేమెఱుంగుఁజుమీ తండ్రీ! రామ. 93

శా. ఓకల్యాణగుణప్రపూర్ణశరధీ! ఓసర్వలోక ప్రియా!
ఓకారుణ్యరసప్రసిద్ధ చరితా! ఓవిశ్వగర్భాత్మకా!
లోకాలోకపరా!పరాత్పరవిభూ! లోకేశ్వరా! దేవ!రా
వే! కాపాడవె! భక్తవత్సలతఁ దండ్రీ! రామ. 94

శా. ఓసర్వాంతరగామి!ఓగుణనిధీ! ఓయాదిమధ్యాంత హీ
నా! పర్వేశ్వర? ఓపురాణపురుషా! నాళీకగర్భాండమా
హా! సర్గస్థితి నాశముల్ గనును దేవా! నీమహాత్వంబుచే,
శేసాష్టాంగనతుల్ పొనర్చెదను దండ్రీ! రామ. 95

శా. దేవా!యీభువనంబునీవలనవ్యాప్తిన్ జెందెనీరూపబహూరః!
యీవిశ్వంబునమస్తమీశ్వర! కృపాబ్ధీ! బుద్బుదప్రాయుఁడన్
నీవేదిక్కు జగన్నివాస! యభవా! నిర్నిద్రతేజస్క! రా
వే! వాత్సల్యతనన్ను నేలగదె? తండ్రీ! రామ. 96

మ. తనయంగంబులలోనికీడ్చుమవెలిన్ దాఁబుచ్చుకూర్మంబు
పోల్కినిసిరేఁచుజగంబులీవు విజకుక్షింబూనుచున్ వాంఛగ
ల్గినవేళన్ వెలిఁబుత్తువే భవభయోద్రేకంబుచేఁబాపు జే
రినవాఁడన్ గనుణింపఁ గావలయుఁ దండ్రీ! రామ. 97

మ. తనయంతన్ వలఁబన్ని యందముగ, నంతన్ మ్రింగు సాలీడుపో
ల్కిని బ్రహ్మాండము సృష్టిసేసి మరలన్ లీనంబు నీగర్భమం
దునఁ గావింతువు దివ్యమంగళతనూ! దోర్ద్వంద్వమున్ మోడ్చిభ
క్తిని బ్రార్థింతు ననుగ్రహింపఁగదె తండ్రీ! రామ. 98

మ. ఉపయోగార్థము కుంభకారుఁడొగి నెన్నో రీతులన్ కుండలె
న్నో పొనర్చున్ గద ద్వేషరాగములఁదా నుల్లంబునన్ బూనఁడ
ట్లె పరీక్షింపఁగఁ బంచభూతయుతసృష్టిన్, బక్షపాతంబుమా
ని పరిపాలనమున్ బొనర్చెదువు; తండ్రీ! రామ. 99

మ. ఉదకంబెట్టుల నెండమావులను లేదో, యట్లె సంసార సం
పదలో సౌఖ్యము లేదు; భ్రాంతివలన న్వర్తించుచున్నారల
య్యదియాత్మానుభవంబునన్ దెలిసి బ్రహ్మానందమున్ బొందని
న్నెదలోనన్ జనముల్ స్మరింపవలెఁ దండ్రీ! రామ. 100

మ. ఎది ప్రేమాస్పదమో యదే జగతి నెంతేఁ జింతకున్ మూలమౌఁ
గద! సంసారము మేడిపండుకరణిన్ గాన్పించు, నీసూత్రమున్
హృదయంబందిడి, దివ్వెపంచనెడి భ్రాంతిన్ జచ్చు కీటంబుపో
ల్కిఁ దగన్ లోకవిభున్ నుతింపవలెఁ దండ్రీ! రామ. 101

శా. ఓ లక్ష్మీశ్వర! ఓ మహాగుణనిధీ! ఓ హరీ! జగన్నాథ! దే
వా! లోకంబులకీవ ప్రాణమవు, నీయందున్న శక్తిత్రయీ
లోలత్వంబు సమస్తసృష్టి కరుణాలోకాళి సారించి న
న్నేలన్ రమ్మని సంస్మరించెదను దండ్రీ! రామ. 102

మ. శునకంబెప్పుడు చెడ్డవస్తువులఁ దెచ్చున్ జిత్తమట్లే తలం
చును దుర్మార్గవిచారముల్, గనులకుఁ జొప్పింపఁ బచ్చద్దముల్
గనుపించున్ జగమంతపచ్చగ, మనఃకంపంబుఁ జాంచల్యబు
ద్ధి విభంజింప నమస్కరించెదను దండ్రీ! రామ. 103

మ. జనవాగ్నిన్ బురికొల్పి దారసమిధన్ సంధించి పుత్రానిలం
బున మండించి కుటుంబపాత్రమున, నీవున్ జొన్న పేలాలభం
గిననున్ వేఁచుదు తప్తమయ్యెఁ దనువీ క్లేశంబు సైపంగఁ జా
లిన సామర్థ్యము లేదు ప్రోవవలెఁ దండ్రీ! రామ. 104

మ. పరగన్ సర్వసుఖంబునన్ బడివకప్పన్ బోలె బెక్ బెక్ మటం
చఱతున్ మృత్యుభయంబు నిండియెటులేన్ బ్రాణాలఁ గాపాడుకో
వెరవేదుండను, నేలవచ్చితిని, బృథ్విన్ వీడి యెందేగుచుం
టి రమేశా! యనలేమియుంగఁగడ! దండ్రీ! రామ. 105

శా. దేవా! విశ్వము నీమహత్వములబోధించున్ విమర్శింపనీ
వే విశ్వంబును విశ్వమూర్తివగు, దయాభృత్త్వా! నినున్ నమ్మితిన్
నీ వేదిక్కు కుటుంబరోగమును వర్ణింపంగ నాశక్యమే!
యీవే చిత్సుఖమున్ ద్రుతంబుగను దండ్రీ! రామ. 106

శా. నీనామస్మరణంబులన్ జలుపుచున్ నీశక్తిఁ గీర్తించుచున్
నీనిర్హేతుకసత్కృపాజలధిలో నిత్యంబు గ్రుంకెట్టుచున్
నీనోముల్ పొనరించుచున్ హృదయమున్ నీకర్పణం బిచ్చితిన్
దీనుండన్ శరణంచువాఁడనుఁ దండ్రీ! రామ. 108

మ. శశిసంచారగతిఁ గణింప రుధిరాక్షి జ్యేష్ఠ శుక్ల త్రయో
దశినైనంబున శాలివాహనశకాబ్దంబుల్, గుణోపాయ స
ద్వసుభూముల్ శతకంబువ్రాసితిమి సద్భక్తిక్రియావేశతఁ
విశదద్వంద సుఖంబులీయఁగదె! తండ్రీ! రామ. 108

మ. ప్రథితార్వేలనిదూగు లాదిపుడి అభ్రాజ్యంశ రాకాసుధా
విధులఁ జానకిసీతరామనుతుల న్వేంకట్రమేశానుజుల్
విదితప్రక్రియ వీరరాఘవుఁడుఁ జేవిఁ సూర్యనారాయణుం
డిది నీకర్పణచేసి రందికొను తండ్రీ! రామచంద్రప్రభూ. 109.

శ్రీరామచంద్ర పరబ్రహ్మార్పణమస్తు.



